శ్రీ



కృష్ణ గురుపరబ్రహ్మణే నమః

# అనంతశతకము.

ఇది

వేమూరి వేంకయాఖ్యునిచే

భక్తి రసావేశముగా

రచియింపఁబడి

శ్రీ మునసు రాజా మాధ్యమిక పాఠశాలలో

తెనుగు పండితుఁడగు

దేవినేని సూరయ్యగారిచే

పరిచూడఁబడి

మచిలీపట్టణము:

శ్రీ ఆర్యానంద ముద్రాక్షర శాలయందు

ముద్రింపఁబడియె

ప్రథమ కూర్పు 500 ప్రతులు.

వెల 0-2-0 1922. కాపీరైట్.

శ్రీ

కృష్ణ గురుపరబ్రహ్మణేనమః.

# అనంతశతకము

ఇది

వేమూరి వేంకయాఖ్యునిచే

భక్తి రసావేశముగా

రచియింపఁబడి

శ్రీ మంతు రాజా మాధ్యమిక పాఠశాలలో

తెనుగు పండితుఁడగు

దేవినేని సూరయ్యగారిచే

సరిచూడఁబడి

శ్రీ ఆర్యానంద ముద్రాక్షర శాలయందు

ముద్రింపఁబడియె.

వెల 0-2-0 1922. కాపీరైట్.

# విజ్ఞప్తి

ఆర్యులారా!

నేఁటివఱకు నే కావ్యగ్రంథములు గాని, లక్షణ గ్రంథములు గాని పఠించియెఱుంగ. ఐనను దఱచుగా భారత భాగవతాది గ్రంథములు మాత్రము జదివి కాలక్షేపముఁ జేయుచుండువాఁడను.

అకృత్రిమ నాకొక విధముగాఁ గల్పనాశక్తి యల వడినది. తత్కాలమున నీశతకము వ్రాయఁ బ్రారంభించి యందుఁగొన్ని పద్దెములు నాకుఁ బరమమిత్రులగు శ్రీయుత దేవినేని సూరయ్య గారికి వినిపింప వారు నాకుఁ జాల ప్రోత్సాహ మిడిరి. వారి ప్రోత్సాహమే నన్నీ శతకముఁ బూర్తిఁ జేయించిన దని వ్రాయుటకు సంతసించు చున్నాఁడను.

మఱియు నీగ్రంథమ్మునంగల లోపమ్ములెల్ల శ్రమ యనక సవరించి యిచ్చిన శ్రీయుత దేవినేని సూరయ్య గారికిఁ గృతజ్ఞతా పూర్వకవందనములు సమర్పించెద.

ఇందింక నచ్చటచ్చటఁగల లోపమ్ములు నావిగాఁ దలంచి గుణగ్రహణ పారీణులగు పండితశిరోమణులు మన్నింపఁ గలందులకు సవినయ పూర్వకమ్ముగాఁ బ్రార్థించు చున్నాఁడను.

ఇట్లు,

1—10—1922 } ఆర్యజన విధేయుఁడు,

ఘంటసాలపాలెము. } వేమూరి వేంకయ్య.

## : స్వవృత్తాంతము. :—

సీ॥ శ్రీమంతమైన గృ ♦ హస్థమండలిని ఘంట
సాలపాలెము నివా ♦ సస్థలంబు
వేమూరి వంశాబ్ధి ♦ సోముండు వేంకట
రామయార్యుండు పి ♦ తామహుండు
పరమార్థచింతనా ♦ పరతంత్రుఁడరయ వేం
కట కృష్ణయాఖ్యుండు ♦ కన్నతండ్రి
మహితపతివ్రతా ♦ మణి నాజగన్నుతిం
గన్న యశోదాంబ ♦ కన్నతల్లి

గీ॥ అనవరత భక్తజనరక్ష ♦ ణాకరుఁడగు
శ్రీరమాధవపదసర ♦ సీరుహంబు
లాత్మలోఁ దల్చి సేవించు ♦ నట్టివాఁడ
ఆర్యజనవిధేయుఁడ! వేంకయాహ్వయుండ!



శ్రీ.



# అనంతస్వామిశతకం.



## కందపద్యములు.



శ్రీరామాపతి నీపద
సారసములు నాదుహృదయా? సారసమందే।
నారూఢి నిలిపికొలచెదఁ
గారుణ్యముతోడ నన్నుఁ ♦ గావుమనంతా॥ 1

ఆలనాఁడు కుచేలుండటు
కులు పిడికెఁడొసంగ వానిఁ ♦ గొని వానికి ని।
య్యిలఁదులలేని సిరులనిడి
నెలమిని రక్షించినట్లు ♦ నేలుమనంతా॥ 2

నందకుమారక! నీకిదె
వందనములొనర్తునే న ♦ వారితభక్తిన్।
సందియము వీడి నీసుతు
డెందంబునఁ గాంచి పేర్మి ♦ సాకుమనంతా। 3

త్రైరమా! నిన్ను తియింపఁగఁ
గఱకంఠున కైన, నురగ ♦ కాంతున కైనన్।
నరుఁడను న ఱియును గదుఁ బా
మరుఁడను నాకలవియగునె? మహితానంతా॥ 4

స్వారాజ్యముఁ గోరిన యా
క్రూరుండగు నరక దైత్యుఁ ♦ గూలిచి యింద్రున్।
గూరిమి నేలిన యదుకుల
వీరుండవు నీవు గాదె? విమలానంతా। 5

మితిఁ దప్పక నినుఁ గొలుచుట
కతినిపుణుఁడఁ గాను గాన ♦ నాత్మనలుగకో।
యతిరాజ వినుతనను న
మ్మతి నేలుము సర్వలోక ♦ మాన్యానంతా॥ 6

శతవత్సరములు మితి జీ
వితమని గతి యెఱుఁగ కెపుడు ♦ వెతలఁబడెదు దు।
ర్మతుల దరిఁ జేరకుండఁగ
సతతముఁ గాపాడు మురగ ♦ శయనానంతా॥ 7

తివసుగల చోటనె నీ
వెపుడును వసియింతువంచు ♦ రెలమిని నే నే।
తపముం జేయుట యెఱుఁగను
గృపతో రక్షింపుమో జ ♦ గీశానంతా॥ 8

కరములు మోడ్చెదఁ బరమా
దరమున వరముల నొసఁగుము ♦ ధరధర ధీరా!
దర! ప్రావృణ్ణీరధారా
ధరతులితశరీర! రిపువి ♦ దారానంతా! 9

మురహర భవహర భవనుత
మురళీధర గోపికాప్ర ♦ మోద దురిత సం।
హార కరుణాకర క్షేమం
కర వరములొసంగి నన్నుఁ ♦ గావుమనంతా! 10

ఇరువదియొక పరిరాజుల
శిరములఁ దునుమాడి ♦ వినుతిఁ జెందినసీ వి।
స్ఫురిత ప్రతాపమెన్నఁగఁ
గరమరుదుగఁ దోఁచునో య ♦ ఖండానంతా! 11

దినకర హిమకరనయనా
మనవినిఁ గైకొని చలంబుమాని ♦ ముదమునన్।
వనచరముఁ బ్రోచినక్రం
బును దునిమినయట్టి ♦ పుణ్యమూర్తివనంతా! 12

వేఁడితి రక్షింపుమనుచుఁ
బాడితి నీకీర్తనంబు ♦ భక్తిఁదలిర్పన్।
గూడితి నీభక్తులతో
నాడితి నినునమ్మిగొల్తు ♦ నంచుననంతా!

మూఁడడుగులడిగి దానము
పోఁడిమితో బలిఁ గెల్చి ♦ ముల్లోకములన్ ।
గూడఁగ జేకొనఁ గలిగిన
ప్రోఁడవు నీమహిమ కడుఁ ♦ బ్రమోదమనంతా ॥ 14

రిపుహర! నీకంటెఁగడు న
ధిపులెవ్వరు లేరుసుమ్ము ♦ త్రిజగమ్ములలోన్ ।
కృపభక్తులఁ బ్రోవఁగ, నీ
వె! పరుఁడవుగాక యన్యు ♦ లెవ్వరనంతా ॥ 15

వేంకటకుధర నిలయ నా
సంకటములు దొలఁగఁ జేసి ♦ సత్వరముగ నే ।
శంకలు బెట్టుకొనక మీ
నాంకజనక నన్నుఁ బ్రోవు ♦ మయ్యయనంతా ॥ 16

కన్యామణి యగు రుక్మిణి
నన్యాయముఁ జేయఁగూడ ♦ దంచుఁదలచియో ।
ధన్యాత్మ! చేకొనిన స
న్మాన్యుఁడవీవంచు నమ్మి ♦ నాఁడ ననంతా ॥ 17

యదువంశ పయోరాశికి
సదమలచంద్రుండ వనఁగ ♦ జనియించి కృపా ।
స్పదుఁడవయి శిష్టజనులన్
ముదమునఁగాపాడితివి ♦ ప్రమోదానంతా ॥ 18

నాకాధార సుధీరా
నాకాధారంబు నీవె ♦ నమ్మితి మది నో।
రాకాసుధాకరానన
షోకరణిని నైన నన్ను ♦ నేలుమనంతా। 19

మరణ సమయమ్మునఁ గా నిను
స్మరియింపఁగ లేనో! లేనో! స్మరియించెద ని।
త్తరి నోపరాత్మ! నా దు
ష్కర పాపములెల్లఁ బాపి ♦ కావుమనంతా॥ 20

ధేనువులనప్పు డింద్రుఁడు
కావనమున నపహరింపఁ ♦ గా నేర్పుమెయిన్।
బూని పునస్సృష్టిసలిపి
పూనవె సత్కీర్తి పుణ్య ♦ మూర్తి వనంతా। 21

యముఁ డొనరించెడు బాధలు
కమల నయన! యోర్వఁ జాల! ♦ కావున నన్నుఁ బే।
రిమిఁ బ్రాపనుఁ జేయవె నే
రము లెన్నక సర్వలోక ♦ రమణానంతా। 22

విబుధులచే వింటిని ప్రే
మఁబరీక్షిత్తు నేలినట్టి ♦ మాన్యుఁడవని, యో।
శబరివరద! సముఁడవు ని
ప్రబల దయారసము నెన్న ♦ వశమె యనంతా। 23

రవిసుతుఁడు ఋశ్యమూకవ
నవరమ్మున నిలిచియుండఁ • గనివానిఁ బ్రే
మ మెలయఁగూడి విజయుఁడిడి
భువి నాతని బ్రోచినట్లు • బ్రోవుమనంతా! 24

చిత్రమునీ చేతలు జన
యిత్రినిఁ గన్నన్నుఁ దింటి • వేమనియడుగన్
జిత్రముగ నోర్దెఱచి యా
ధాత్ర్యండముఁ జూపితౌము • దమున ననంతా! 25

తగునిది తగదని యరయక
సగభాగముకిండ నగ్ర • జన్మునకు హాలం
బొగి నొసఁగినీవు చక్రం
బగణితముగఁ దాల్చినాఁడ • వౌర! యనంతా! 26

ముచికుందవరద నరునకు
సచివుఁడవై యఖిలమహావి • మతములు పేర్మిన్
ప్రచురంబుజేసి వానిని
నచలునిగాఁ జేసినాఁడ • వవనిననంతా! 27

సుతులని సతులని హితులని
యతిమోహముఁ జెందియుందు • రనయమ్మును నా
సతులును సుతులును రారా
హితులును రారంతమున రమేశానంతా! 28

జననంబందిన దాదిగ
నిను సన్నుతి జేయుచుంటి ♦ నిక్కమ్ముగ నా।
మనవినిచేకొనకడుగ్ర
క్కునకామితమొసఁగుమయ్య ♦ కూర్మిననంతా। 29

సదిసేయుచు సతమును నా
మతిసన్నుతి జేయుచుంటి ♦ మన్నించుము నే।
నతికిల్బిషములు జేసితి
గతినాకింకెవరు నీవె ♦ గాకయనంతా। 30

హృత్తలమున నీరూపము
హత్తించిస్మరింతు నామొ ♦ రాలించి కృపా।
యుత్తత బ్రోవుమునను నీ
వెత్తెరగుననైన నన్య ♦ మెఱుఁగననంతా। 31

దరిఁజేరఁగఁజాలని యీ
దురితాబ్ధిని నెట్లుదాటు ♦ దునో! యను భయము।
త్తతిలేదునీదు నామ
స్మరణమనెడు నోడదొరకె ♦ జాలుననంతా। 32

యదుకులసంభవ సంయమి
హృదయాబ్జవిహార లోక ♦ హితసంచారా।
సదయాంతరంగ నీమృదు
పదయుగములు నమ్మినాఁడ ♦ పాహియనంతా। 33

రంజిల్లు నీదు లీలలు
కుంజరవరదా! ముదంబుఁ ♦ గూర్చుఁగదా నీ।
మంజుల రూపముఁ జూపిన
మంజనముగఁ బ్రోవుమయ్య ♦ మహితానంతా। 34

జలజదళ నేత్ర! నీపద
జలజంబులు హృదయమందు ♦ స్మరియించిననే।
కలుషంబు లంటవని పె
ద్దలు జెప్పఁగ వింటినే ము ♦ దమున ననంతా। 35

నరజన్మ మెత్తుటయె దు
ర్భరమందు భవత్పదాబ్జ ♦ భక్తుఁడగుట దు।
స్తరమేను నీ పదాబ్జ
స్మరణముఁ జేయంగలిగితి ♦ మహిని ననంతా॥ 36

ముదమున నీపద యుగళము
వదలక పూజించునట్టి ♦ వారలు ముక్తి।
ప్రద! నీ దయ కర్హులరై
ముదముల్ గాంచంగలారు ♦ పుడమి ననంతా। 37

సరసమ్ముగ రాధాసతి
సరసన్నిలుచుండి మృదుల ♦ సల్లాపముల్।
మురిపెమ్ముఁ జెందునీ బం
ధురచేష్టలు దలఁపఁజింత ♦ తొలఁగు ననంతా॥ 38

కమనీయమైననీ చరి
తమువిని భక్తులను బ్రోచు ♦ దాతవనుచు నీ।
సమయమున వేఁడుచుంటిని
కమలాసనజనక కరుణఁ ♦ గావుమనంతా॥ 39

లక్ష్యముగ నీదురూపము
వీక్షింపుచునయమేను ♦ వినుతించెద నో।
పక్షీంద్రవాహనా! సం
రక్షింపఁగరమ్ము వే బి ♦ రాననంతా॥ 40

జననీజనకులఁ గంసుఁడు
పనిఁగొని కారాగృహంబు ♦ పాల్సేసెఁటా
చెవ లేనికోపమున వా
నినిఁగూల్చితివింతయపుడె ♦ నిక్కమనంతా॥ 41

నుతిఁజేసిన నీనామము
నతిపతితులఁగూడఁబావ ♦ నాత్ములఁగా నీ।
క్షితిలోనఁజేసి కృప స
ద్గతినొసఁగెదవౌర! యద్భుతముగ ననంతా॥ 42

అసమానమైన నీయశ
మసమానముగా వెలుంగు ♦ నఖిల భువనముల్।
పసమీఱాజి క్రమ్ముకొనె స
ర్వసముండవు నిన్ను నెన్న ♦ వశమె? యనంతా॥ 43

కులమేల? గోత్రమేలా?
సలలితముగ నిన్ను వినుతి ♦ సలుపుట కెపుడున్।
కుల గోత్రములకు మించిన
దిల గుణము మొక్కటియె కాదె? ♦ యెన్న ననంతా॥44

ఉపవాసాది వ్రతములు,
జప తపములు నిష్ఠలెల్ల ♦ సలుపుటఁ జూడన్।
విపరీత వృత్తులగు ని
న్నెపుడుఁ దలఁచు వారికవి ర ♦ మేశానంతా॥ 45

పలలమ్ముఁ దినుచుఁ గల్లున్
సలలితముగఁ గ్రోలుచుండు ♦ ఛండాలుర నే।
కలికాలమందుఁ గడు ధ
మ్యులఁగాఁ దలపోయుచుందు ♦ రుర్వి ననంతా॥ 46

యోగీశ హృద్విహారా!
రాగద్వేషాది రహిత ♦ రఘుకులవీరా।
ఆగమ వినుతోదారా
సాగర గంభీర! వేద ♦ సారానంతా॥ 47

గరుడ తురంగా! యదుకుల
వర! కలుష విభంగ! భక్త ♦ వత్సల కరుణా।
స్ఫురితాంతరంగ! నీపద
సరోజయుగ మభినుతింతు ♦ శ్రద్ధ ననంతా॥ 48

కరములు మోడ్చెద నంగన
వరములు దయఁజేసినన్ను ♦ వారిజకరుఁణా।
గరుణింపుము వరుఁడనుగా
వరయఁగ భక్తుఁడనిక ♦ మయ్యయనంతా। 49

రమ్యాననుఁ బ్రోవఁగ వర
మిమ్మారక్షింతునంచు ♦ నెలమిఁదనరఁ గో।
పమ్మాత్మఁబూనఁగా న్యా
యమ్మా ? దీనుండనంటి ♦ నయ్యయనంతా। 50

ముదమున నినుఁ గొలిచిన వా
రిదయఁ గ రక్షించుంతు వని క ♦ రివరద నిరతం
బెదలోననమ్మి నీమృదు
పదయుగములు గొలుచుచుంటి ♦ భక్తిననంతా। 51

ఇడుములు దొలగించియు నా
యుడుతకుఁగడుఁ బెన్మిమోక్ష ♦ మొసఁగిఁటుల నో।
యుడు రాజమకుటనుత న
న్నడియేనిని వేగఁ బ్రోవు ♦ మయ్యయనంతా। 52

దినకరకులమున జననం
బును బొంది దశాస్యుఁదునిమి ♦ భూభార నివా।
రణమొనరించిన నీఘన
మును బొగడఁగ నాకువశమె ? ♦ పుడమిననంతా।35

చదువఁగ శాస్త్రమెఱుఁగను
మదిఁగుదురుగ బఱచునట్టి ♦ మార్గమెఱుఁగనే
మ్మది లేనివాఁడ దిక్కె
య్యదియని చింతించుచుంటి ♦ నయ్యనంతా! 54

దివిజేంద్రవంద్య! యా కౌ
రవనాథుని సాన్వయముగ ♦ రణరంగమునం
రవమానపఱచియా పాం
డవులను రక్షింపవే క ♦ దంగియనంతా! 55

విన్నప మాలింపుమ! యో
పన్నగరాడ్శయన! వీఁడు ♦ పాపుఁడనుచు లో
నెన్నక రక్షింపుము నీ
కన్నను నాకింకఁ దిక్కుఁ ♦ గలరే? యనంతా! 56

నరసింహాకృతితో నా
దురితాత్మహిరణ్యకశిపుఁ ♦ దునుమాడి గుణా
కరుఁడగు ప్రహ్లాదునిఁ గని
కరమునరక్షింపలేదె? ♦ కనఁగననంతా! 57

విరిబోఁణులగౌగిళులం
దరయఁగ నెట్లలరినావొ! ♦ యనయము యోగీ
శ్వరుల హృదయముల మెలఁగెడి
పరమాత్ముఁడ వీవటంద్రు ♦ పరిగననంతా! 58

నిక్కమ్ముగ నీనామముఁ
జక్కఁగ జపియించునట్టి సదమలచిత్తుల్।
చిక్కక యముబారికిఁ దా
మక్కజముగ నిన్నుఁగాంతు ♦ రమలానంతా॥ 59

నమ్మిన నిన్నే మదిలో
నమ్మవలెఁ బగతుఁదమ్ము ♦ నకునభిషేకం।
బిమ్ముగఁ జేసినకడు నె
య్యమ్ముగలుగు వేల్పువీవె ♦ యవని ననంతా॥ 60

వారిజనేత్రా! యదుకుల
వీరా! భువనత్రయాభి ♦ వినుతపవిత్రా।
ధీరమనోజ్ఞ చరిత్రా!
ధారాధరగాత్ర! రిపువి ♦ దారానంతా॥ 16

రమణుల మాయలలోఁబడి
సుమశరు బాఁకిపనోడి ♦ సుఖపరతఁ గా।
లము నంతేఁ బుచ్చితిఁక నే
మమునఁ దలఁతునీదుపదక ♦ మలములనంతా॥ 62

లంబోదర జనకనుతా
డంబరహితఘోరశైవపు ♦ డమినీదంష్ట్రా।
గ్రంబున నిలిపి హిరణ్యా
క్షుంబరిమార్చితివి లోక ♦ శూరానంతా॥ 63

దయలేదా! నామీఁద వి
జయరక్షక యాకుచేలు ♦ చందంబున న।
వ్యయభాగ్యమొసఁగ మనలే
దయ! ముక్తియె కోరుకొంటి ♦ నాత్మననంతా॥ 64

రుక్మాంగదునవలె వ్రతమో
రుక్మాంబర! చేయఁజాల ♦ రూఢిగ మదినో।
రుక్మిమదహరణ! బ్రోవుము
రుక్మిణివర! వినుతపదస ♦ రోజానంతా॥ 65

ఇహలోక సుఖముల మఱగి
యహహా యనిత్యతృప్తిఁ బొంది ♦ యవినీతుఁడనై।
ఇహపర భేదంబరయక
యహిరాడ్శయనా మెలంగి ♦ నాఁడనంతా॥ 66

హరి నీమహిమ మెఱుంగక
దురితాత్ములు మాయలోన ♦ దూఱి మహాదు।
స్తరసంసారాంబుధిలోఁ
బొరలుచునుందురు సురప్ర ♦ మోదానంతా॥ 67

లోపమ్ములరయక మన
స్తాపమ్ములనెల్లఁ దీర్చి ♦ సన్మార్గము నో।
పాపహర! చూపినను గృపఁ
గాపాడుము దిక్కు నీవె ♦ కనుక ననంతా॥ 68

కనుమా దయతో మనవిని
వినుమా నావందనములు ♦ వేడుకతోఁ గై
కొనుమా పాపభయము లే
దనుమా ధైర్యంబుఁ గలుగ ♦ నాత్మకనంతా॥ 69

సుజనులతోఁ గూడినినుఁ
భజియించుటఁ గల్గెనాకు ♦ భయమేమియు లే।
దజసుర సమార్చిత పదాం
భుజయుగ్మా! నన్నుఁ గరుణఁ ♦ బ్రోవుమనంతా॥ 70

ఖగరాజగమన నాపైఁ
బగయా! పిలిచినఁ బలుకవు ♦ పంతముఁ బూనన్।
నగరా! భక్తుఁడనగు న
న్నగడుఁ బఱుపనీకు నాయ ♦ మగునె యనంతా॥ 71

ముఱిపెమునఁ గలుముల వెలఁది
యురమున వసియించి ముద్దు ♦ లొలుకుఁ బలుకులన్।
గరము ముదమొదవఁ జేయఁగఁ
బరగు మహాదేవ నత్స్వ ♦ భావానంతా॥ 72

లవమైనఁ గరుణఁ జూపవు
భవబంధములోనఁ జిక్కి ♦ బాధపడెడు న
న్నెవరిఁకఁ బ్రోవఁగలరో
నవనీతసేయ! తెలియ ♦ నాఁడుమనంతా॥ 73

సుగతిఁ జేతు శ్రీరమాపతి!
యతిభక్తిని మనమునంద ♦ హర్నిశముఁ నా।
గతినీవెయంచు నమ్మిన
గతిఁజూపి దయారసమునఁ ♦ గావుమనంతా। 74

భరమైతోఁచు కుటుంబము
భరియింపఁగలేక చెడుగు ♦ తనులఁ బతిసిరి।
స్మరియింపరు కుజనులు సం
సరణమె గొప్పగఁదలంచి ♦ జగతిననంతా। 75

వింటిఁ బెద్దలచే నీ
కంటెఘనులు వేరటంచుఁ ♦ గాపాడఁగ రా।
మ్మంటిని నన్బ్రోవఁగ నే
నుంటిని నీపయినిదీక్ష ♦ నుంచి యనంతా। 76

చిలువలదొర పానుపు నా
పులుగుల దొర తేజికల్మి ♦ పొలతియె యూళై।
చెలువలరు వేల్పనిన్నున్
దలఁచినచో ముక్తిగల్గు ♦ ధరణి ననంతా॥ 77

భద్రమగునీదు రూపము
రుద్రాదులు సతముహృత్స రోజమ్ముల ని।
ర్నిద్రమగు భక్తినిలిపి స
ముద్రనిలయ! కొలుచుచుంద్రు ♦ పుడమి ననంతా॥78

వలిగలపై నూరబ్దము
లలసి తపం బాచరించు ♦ యతులకు నైనన్ ।
వలనగునె నిన్ను గానన్
గలుషాత్ముఁడ నన్నుఁ గరుణఁ ♦ గావు మనంతా! 79

బంధురముగ నుండిరి ప్రియ
బంధువులని దేహిచాల ♦ భ్రమఁ జెందుదయా!
సింధూ! తలపోయఁగ భవ
బంధములన్ ద్రుంచువారి ♦ వశమె యనంతా! 80

ధరియించి మత్స్యరూపముఁ
బోరిగొని సోమకుని శ్రుతులు ♦ బ్రహ్మ కొసఁగి వి।
స్ఫురకీర్తిని వహియించిన
పరమాత్ముఁడ! నిన్నుఁ దలఁతు ♦ భక్తి ననంతా! 81

మునిపతి శాపంబునఁ గా
ననమున శిలరీతినున్న ♦ నాతి భవత్స్ప।
ర్శనమున శాపవిమోచన
మును బొందిన దెంతొ వింత ♦ పాదము ననంతా! 82

లలితమ్ముగఁ గమఠాకృతి
నలనాఁడు ధరించి మంథ ♦ రాచలముఁ దగన్ ।
నిలిపితివి వీఁపుపై ని
శ్చలముగ దేవతలఁ బ్రోవ ♦ సరగ ననంతా! 83

బాలుఁడవై కాననమునఁ
గాళిందీ మడువునఁ గల ♦ కాళీయాహిన్।
లీలన్ గెలిచి యపుడ గో
పాలురకున్ ముదమిడితివి ♦ పరగ ననంతా॥ 84

సిగమునను బర్హి బర్హముఁ
గరమున్న మూఁకోలఁ బూని ♦ కంఠమునందున్।
గురిగింద పేర్లుఁ దనరఁగ
మురళిన్ మ్రోయించునీకు ♦ మ్రొక్కుద నంతా॥ 85

తులసీమాలలు గళమున
వెలయఁగ దాఁబుర ధరించి ♦ వేడుకతోఁ జే।
తుల దాళము నుంచియు నిన్
గొలుతురు భక్తులు విముక్తి ♦ కొఱకు ననంతా॥ 86

దరహసిత వదన! యొకపరిఁ
గరమరుదగు నిసురూపుఁ ♦ గనఁబఱచినన్।
బరమ పవిత్రునిఁ జేయఁగ
నరఁజేసెనవేల? న్యాయమహయ్య! ♦ యనంతా॥ 87

కుధరంబు వ్రేలఁగొన నె
వ్విధమున ధరియించినావొ! ♦ యింతవాఁడవు నో।
విధిజనక! నీ ప్రభావము
విధికైనను నెన్నఁ దరమె? ♦ విపుల ననంతా॥ 88

హరియించు నీదునామ
స్మరణమొక్కసారిఁ జేయు ♦ సర్వకలుషముల్ ।
పరమాత్మ! సర్వకాలము
స్మరియించినఁ గలుగుఫలము ♦ మహితమనంతా ॥ 89

రిపులగు దుష్టాసురులన్
నిపుణతఁ బరిమార్చినట్టి ♦ నేర్పరివౌ నీ
యుపమ మఱి కైనఁ గల్గునె?
తపనీయాంబర! మహాప్ర ♦ తాపానంతా ॥ 90

దశకంఠునిఁ బరిమార్చియు
దిశలందున నీదుకీర్తి ♦ తేజరిలంగాఁ ।
గుశలముగ సీతనుఁ గొని
ధృతి సౌఖ్యముఁ గాంచినావు ♦ ధృత్యనంతా ॥ 91

యమునాతటమున గోపీ
సుమగాత్రులఁ గూడి నీవు ♦ సుచిరముగ గా ।
నముఁ జేయుచుఁ జొక్కించు వి
ధముఁ దలఁచిన నిప్డు ♦ ముదమొదవు ననంతా ॥ 92

నలిమెదదయారసమ్ముపైఁ
జిలికినఁ గలుషంబులెల్లఁ ♦ శ్రీయఃపతీ! పూ
ర్వలుకవు పిలిచిననాకి
య్యిలఁ దోడుకడంగ నింక ♦ నెవ్వరనంతా ॥ 93

పరమాత్మ! నీదు భక్తుల
వరము లొసఁగి బ్రోచునట్టి ♦ భారము విశ్వం!
భరమున నీదెకదా సు
స్థిరముగఁ దలఁపఁ ద్రిలోక ♦ దీపానంతా! 94

రక్షించితి వాకుబ్జన్
పక్షీంద్రధ్వజ! విమల కృ ♦ పారసనులరన్!
దక్షుఁడ నన్నిటు ననుచుఁ బ్ర
తిక్షణమున్ దలఁచుచుంటి ♦ దేవానంతా! 95

మదిచెడి ముదిమింబడి నే
కుదురున్ విడియుల జడిబడి ♦ కుందెడు వేళన్!
హృదయమునఁ దలఁప వేనం
చొదవెఱుఖుకు నిష్ఠదలఁతు ♦ నుర్వి ననంతా! 96

పగఁబూని మఘవుఁడతి జో
రుగను శిలావృష్టిఁగురుప ♦ రూఢిచెడక యా!
నగమున్ గేలన్ దాలిచి
నగరిపు గర్వంబునపుడ ♦ ణఁచితివనంతా! 97

దనుజుల మాయలు గెలువఁగ
వనజాయత నేత్ర! నీకు ♦ వశమగుఁగానీ
కనుఁగొన నన్యుల కేరిక
యినవశమగునే తలంప ♦ నిలను ననంతా! 98

విశ్వాత్మక! విశ్వేశ్వర!
శాశ్వతమగు నీదుసేవ ♦ సలుపకనరులీ।
యశ్వరమగు దేహముపై
విశ్వాసంబుంచ్రతు చెడఁగ ♦ వెఱ్ఱి ననంతా॥ 99

గంగాధరపూజిత మా
తంగాధిప వరద! నను ము ♦ దంబలరఁ బ్రోవ్।
వంగా రమ్మనఁ జలమూ
నంగానీకగునె? వేడ్కా ♦ సంగ ననంతా। 100

దురమున భీష్మునితోఁ బో
ర్వైరివిగ నొనరించు నాకి ♦ రీటికి జయముఁ।
నరగుననొనఁగ రథము భీ
కరముగ లంఘించినావు ♦ కదర! యనంతా॥ 101

రుచిరమగు నీదునామము
నచలాత్మఁదలంచునట్టి ♦ యనఘాత్ములు పు
ణ్యచరిత్రులై చరింతురు
శచీధవనుతాంఘ్రి యుగళ ♦ జగతి ననంతా॥ 102

సందేహామేల నిను భ
జించెదేహాయంచు వేఁడ ♦ సదయంగని నా।
యందేలోపములున్నను
మందేమన్నింపుమంటిఁ ♦ బుడమిననంతా॥ 103

దేవర! నీదాస్య సుఖం
బే వేఁడెదనితర మేన ♦ పేక్షింపను నా।
కీవేపాపుఁడనని నీ
భావమునఁ దలఁపకో ప్ర ♦ భావానంతా। 104

మారనుత సురహిత చరితా
కరధృత చక్రాయుధా! వి ♦ కార విరహితా।
పరిహృత వైరివ్రజ! శ్రీ
కరశతధృతి పూజితాంఘ్రి ♦ కమలానంతా। 105

మును నేఁ జేసిన నేరము
లను నీహృదయంబునఁ ద ♦ లంపవలదటం।
చనఘాత్మ! వేఁడుకొంటిఁ
గనికరముఁ జూపి వేఁగఁ ♦ గావు మనంతా। 106

లేమానవ హృత్కామా
కామారిస్తోత్ర! భక్త ♦ కామా! సుగుణ।
స్తోమా! రఘుకులవార్ధి
సోమా! ననుఁ బ్రేమతోడఁ ♦ జూడుమనంతా। 107

దురితలతాదాత్ర! మహా
స్ఫురితయశోమయా సుగాత్ర! పుణ్యచరిత్రా!
పరమపవిత్రా! నవపు
ష్కరనేత్రా! నన్నుఁ బేర్మిఁ ♦ గావు మనంతా। 108

శ్రీయుత! కృపతోడుత దీ
ర్ఘాయువు నారోగ్య విభవ ♦ కలితానందం।
బీయుము యిదిచదువుచుఁ దగ
వ్రాయుచుఁ గాలమ్ముఁబుచ్చు వారికనంతా॥ 109

సర్వం శ్రీ భగవదర్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ



## మంగళహారతి.

హిందుస్థాని కాఫిరాగం - ఆటతాళం.

మంగళహారతి । మాహృదయేశా।
మంగళకరగొను । మాస్వప్రకాశా॥ మం ॥

1 సూర్యకులాంబుధి । సురుచిరసోమా।
ఆర్యవినుత సుగు । ణాభిరామా॥ మం ॥

2 రామభువన సు । త్రామారణభీమా।
కామజనక త్రిజ । గన్నుతనామా॥ మం ॥

3 వాలాయముగ ఘంట । సాలపాతెమందుర।
లీలావెలసిన లక్ష్మి । లోలానినుదలతుర॥ మం॥



# —: కాలజ్ఞానము.

ఇందు రోగియొక్క యరిష్టములెల్ల విపులముగా వర్ణింపఁబడియున్నవి ఇది వైద్యులకే గాక యితరులకుఁ గూడఁ జాల యుపయోగము.

సంస్కృత భాషలోనున్న దీనినిఁ బఠించుట యెల్ల అరు సులభముగాదని తలంచి తేట తెనుఁగు మాటలతో వ్రాయంబడి యున్నది. దీని ఖరీదు 0—4—0 మాత్రమే వలయువారీ దిగువ విలాసమునకు వ్రాసికొనినఁ బడయఁ గలరు.

☞ దేవినేని సూరయ్య,

తెలుఁగు పండితుఁడు,

శ్రీ మంతురాజా మాధ్యమిక పాఠశా.

చల్లపల్లి.

# —: కాలజ్ఞానము :—

——:O:——

ఇందు రోగియొక్క యరిష్టము లెల్ల విపులముగా వర్ణింపఁ బడియున్నవి ఇది వైద్యులకే గాక యితరులకుఁ గూడఁ జాల యుపయోగము.

సంస్కృత భాషలోనున్న దీనినిఁ బఠించుట యెల్ల అకు సులభముగాదని తలంచి తేట తెనుఁగు మాటలతో వ్రాయంబడి యున్నది. దీని ఖరీదు 0—4—0 మాత్రమే వలయువారీ దిగువ విలాసమునకు వ్రాసికొనినఁ బడయఁ గలరు.

☞ దేవినేని సూరయ్య,

తెలుఁగు పండితుఁడు,

శ్రీ మంతురాజా మాధ్యమిక పాఠశాల

చల్లపల్లి.



